# ఆంధ్రపత్రిక

316913



The Andhra Patrika, Madras, } Regd No 1118, Vol, 34 No 141 MONDAY 15th SEPTEMBER 1947 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao

# పరిహారం ఇచ్చి జమీందారీల రద్దుచేయడానికి మద్రాసు ప్రభుత్వ బిల్లు

## పదికోట్ల రూపాయిలు వెచ్చించడంవల్ల సాలుకు కోటి రూపాయిలు ఆదాయం

### బిల్లు ప్రధాన లక్షణాల వివరిస్తూ రివెన్యూ మంత్రి కళా వెంకట్రావుగారి ప్రకటన

ఎస్టేటులోని భూమిశిస్తును రైత్వారీ ప్రాంతాల శిస్తుతో సమానం చేయడానికి వెంటనే చర్య

చెన్నపట్నం, సెప్టెంబరు 14: రాజధానిలోని జమీందారీ, ఇనాందారీ లను సాధ్యమైనంత త్వరలో, పరిహారం ఇచ్చి, తమ వశం చేసుకొనడానికి మద్రాసు ప్రభుత్వం నిశ్చయించింది. ఈ పని ఏడాదలోపునే పూర్తి అవుతుందని రివెన్యూమంత్రి వెంకట్రావుగారు నమ్ముతున్నారు. ఈ సంస్కరణకు సంబంధించిన మూడుబిల్లులు నేడు ప్రకటితమైనవి.

మొదటిబిల్లు జమీందారీల రద్దుకు, జమీందారుల కివ్వవలసిన పరిహారం, మధ్యస్థకాలంలో జమీందారీ వ్యవహారాల నిర్వహణ, ప్రస్తుతపు ఎస్టేటు ఉద్యోగుల భవిష్యత్తు, ఈ బిల్లు శాసనమైన తరువాత దీనిని పురస్కరించుకొని రాగల దావాలు వగైరాల పరిష్కారం మొదలైన విషయాలకు సంబంధించినది. పరిహారం ఏరూపంలో ఇవ్వడమౌతుందో బిల్లు స్పష్టంచేయలేదు. ప్రభుత్వం తరువాత నిర్ణయిస్తుంది.

ఎంత పరిహారం అన్నదికూడా వెంటనే తేలదు. ఏ విధంగా పరిహారం ఇవ్వదలచారో దాన్ని మాత్రం ప్రభుత్వంవారు బిల్లులో ఉదహరించారు. వెయ్యిరూపాయిలు సాలుసరి ఆదాయం మించని ఎస్టేటుదారులకు ఆ మొత్తానికి పాతికరెట్లు ముదరా ఇస్తారు. సాలుసరి ఆదాయం లక్షరూపాయిలను మించి ఉంటే ఆ ఆదాయానికి పన్నెండున్నర రెట్లుగాని, లేక 15 లక్షల రూపాయిలుగాని ఏ మొత్తం ఎక్కువైతే ఆ మొత్తం ముదరా ఇవ్వడమౌతుంది.

సాలుసరి ఆదాయం ఏవిధంగా తేల్చబడేదీ కూడా బిల్లులో వివరింపబడి ఉంది. ముందు భూమిశిస్తును పక్కనున్న రైత్వారీశిస్తులతో సరిసమానంచేస్తారు. కొన్నిప్రాంతాల జమీందారీల్లో శిస్తే తక్కువగా ఉంటున్నది, అలాంటి పరిస్థితులలో ఈ శిస్తును మార్చరు. అవ్వకారంగా స్వంతకమతాలు, జిరాయితీభూములను మినహాయించి మిగతా భూమికి శిస్తు ఎంత అవుతుందో లెక్కవేసి అందునుంచి మూడోవంతు మొత్తం తీసుకుంటారు. ఈ మొత్తంలో నుంచి నూటికి 13 1/3 వంతున తగ్గించగా మిగతా మొత్తం సాలుసరి ఆదాయంగా పరిగణింపబడును. ఇనాంగ్రామాల విషయంలో మూడోవంతు మొత్తానికి బదులు సగం మొత్తం తీసుకొని ఈ లెక్కల ప్రకారమే సాలుసరి ఆదాయం నిర్ణయిస్తారు.

ఈ పని యావత్తూ నిర్వహించడానికి ఒక కమీషనర్‌నూ, ఒక డైరెక్టర్ ఆఫ్ సెటిల్మెంట్‌ను నియమించారు.

### రివెన్యూమంత్రి వివరణ

మద్రాసు ప్రభుత్వమువారు జమీందారీల రద్దు బిల్లును ప్రచురించినారు. రివెన్యూమంత్రి శ్రీ కళా వెంకటరావుగారు ఈ సందర్భమున పత్రికావిలేఖరుల సమావేశములో, జమీందారీలను స్వాధీన పరచుకొనుట కొన్ని నెలలలోనే జరుగునని, జమీందారుల కిచ్చు నష్టపరిహారము రూ 10 కోట్లను మించదని, ఈ జమీందారీ భూములను స్వాధీనపరచుకొనుటచే ప్రభుత్వమునకు లభించు సాలీనా రాబడి దాదాపు ఒకకోటి రూపాయలను మించక పోవచ్చునని, ఈ కార్యక్రమముల నన్నింటిని నడుపుటకు కావలసిన ఉద్యోగులను నియమించుటే ఆలశ్యంగా చట్టం అమలు జరుపబడగలదని తెలిపిరి.

ఇందుకు సంబంధించి మూడు బిల్లులు ప్రకటింపబడినవి. ఇందులో మొదటి బిల్లు పర్మినెంట్ సెటిల్మెంట్‌ను [శాశ్వత పరిష్కార పద్ధతిని] రద్దుచేయుటకు నిర్దేశింపబడినది. రెండవది మద్రాస్ ఎస్టేట్స్ లాండ్ ఆక్టు క్రింద పాలింపబడుచున్న భూములశిస్తును, పొరుగునున్న రైతువారీ భూములశిస్తుతో సమముచేసినట్లు తగ్గించుటకు ఉద్దేశింపబడినది. మూడవది భూములను పరాధీనము చేయకుండా నిషేధించుటకు (వెనుక ఈ విషయమై చేసిన ఆర్డినెన్సుకు బదులుగ) ఉద్దేశింపబడినది.

జమీందారీ రద్దు బిల్లును వివరీకరించుచు రివెన్యూమంత్రి కళా వెంకట్రావుగారు శనివారం సాయంత్రం పత్రికావిలేఖరుల సమావేశంలో ఈ విధంగా చెప్పిరి:

ప్రభుత్వపు ప్రకటన ప్రకారం—ప్రకటన జరిగిననాటినుంచే ఎస్టేట్ అధీనములోనున్న భూములు, పోరంబోకులు, బంజరుభూములు, అడవులు, రైతువారీ భూములకు సంబంధించని గనులు, ఖనిజములు, ఇర్రిగేషన్ నిర్మాణములు, ఎస్టేట్ పాలనకు వినియోగింపబడుచున్న కార్యాలయ భవనాలు ఇవన్నియు ప్రభుత్వ స్వాధీనములోనికి వచ్చును. అప్పుడు అది "ఎస్టేట్" అనిపించబడదు. దానికి చట్టప్రకారము 'రైతువారీభూమి' అందురు. రైతువారీపద్ధతులపై పూర్తిగా పరిష్కారము జరుగునంతవరకు— అది జిల్లాలో రైతువారీ భూభాగముగా మార్పును పొందునంతవరకు—ఒక మేనేజరు నియమింపబడును. అంతవరకు ఎస్టేట్ ప్రత్యేకభాగముక్రింద పరిగణింపబడును. మేనేజరు రైతువారీ పద్ధతులపైననే శిస్తు వసూలు చేయును. ఎస్టేట్ ఇంతవరకు సర్వే చేయనట్లయితే, సర్వే చేయబడును. సర్వే అయిన ఎస్టేటుల విషయంలో ఎంతవరకు అవసరమో అంతవరకు చేయబడును. సర్వే ఖర్చులు ప్రభుత్వమే భరించును. సర్వే అనంతరమే రైతువారీ పద్ధతులపై భూమి రీసెటిల్‌మెంటు జరుగును.

ఎస్టేట్ భూములపై పన్నులరేట్లు ఆ జిల్లాలో జరిగిన రీసెటిల్మెంటు ప్రకటన ప్రకారమూ నిర్ణయించబడును. రైతువారీ పరిష్కారము పూర్తి అగునంతవరకు, ఎస్టేటుహక్కుదారులకు— లేక సహహక్కుదారులకు— తాత్కాలిక పరిహారమివ్వబడుచుండును. ఈ తాత్కాలిక పరిహారము— బిల్లులోని (సి) క్లాజులో నిర్ణయించిన సాలీనా పరిహారపు (బేసిక్) సొమ్మును మించదు. ఈ ఎస్టేట్ ఆదాయముపై ఎవరెవరు హక్కుదారులో ఒక ప్రత్యేక (జ్యుడిషల్) విచారణసంఘం నిర్ణయించును.

#### నష్ట పరిహారం

"రయిత్వారీ సెటిల్మెంటు పూర్తి అయినపిదప, ప్రభుత్వమునకు భాగస్థులకు ఎంతనష్ట పరిహారమివ్వాలో నిర్ణయింపబడును. ఎస్టేటునకు సాలీనా

8 వ పేజీ చూడుడు



### శరణార్థులను పంపివేసే సమస్య

#### లాహోరులో ఉభయ ప్రధానుల సమావేశం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 13: శరణాగతులను పంపివేయుటకు సంబంధించిన సమస్యను చర్చించుటకు ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు పాకిస్థాన్ ప్రధానితో లాహోరుపై రేపు లాహోరుకు బయలుదేరి వెళ్లుచున్నారు. దేశరక్షణశాఖమంత్రి సర్దార్ బలదేవ్‌సింగ్‌గారు ప్రధానితో వెళ్లుచున్నారు. పండిత నెహ్రూగారును, రక్షణశాఖమంత్రియు రేపు సాయంత్రము ఢిల్లీ తిరిగివత్తురు.

#### లియాకత్ ఆలీఖాన్

కరాచీ, సెప్టెంబరు 13: పాకిస్థాన్ ప్రధాని లియాకత్ ఆలీఖాన్‌గారు భార్యతోను, పాకిస్థాన్ ప్రభుత్వ ఆర్థికశాఖమంత్రి గులామ్ మహమ్మద్ గారితోను, ఆంతరంగిక కార్యదర్శి యుసుఫ్ సి. ఎస్. గారితోను కలిసి నేటి ఉదయం లాహోరుకు బయలుదేరి వెళ్లిరి. ... నాడు తూర్పు పంజాబునుండి శరణాగతులను పంపివేయుటకు సంబంధించిన సమస్యలను పశ్చిమ పంజాబు మంత్రులు, సివిల్, మిలిటరీ అధికారులతో చర్చించెదరు. ఆయన రేపు ఇండియా ప్రధాని పండిత జవహర్లాల్ నెహ్రూగారితో సంప్రదించవచ్చును. నాలుగైదు రోజులలో లియాకతాలీగారు కరాచీకి తిరిగి వచ్చెదరు.

రేపు జరుగు ఇండియా పాకిస్థాన్ ప్రధానమంత్రుల సభకు హాజరు కావలసినది ... పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్ర గవర్నరు ... ప్రధాని ఖాన్ అబ్దుల్ కయ్యూమ్ ఖాన్ గారలు కోరబడినని నమ్మకముగా తెలియుచున్నది. (అ. ప్రె.)

### "భారీ ఎత్తున జనాభా పరటాయే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నెదుర్కొంటున్న సమస్య"

#### మతసంక్షోభ చరిత్రను సమీక్షిస్తూ భారతప్రధాని పండిట్ నెహ్రూ ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 13: "పశ్చిమ పంజాబునుండి తూర్పు పంజాబుకు దాదాపు 13 లక్షలమంది వచ్చిఉంటారు. తూర్పునుండి పడమరకు కూడా ఇంచుమించు ఇంతమందీ వెళ్లి ఉంటారు. అటు ఇటూ బహుశా మరొక 5 లక్షల మందైనా ప్రయాణంలో ఉండి ఉంటారు. రెండువైపులా ఇంకా చెరి ఇరువదిలక్షల మందినైనా బయలుదేర దియ్యవలసి వుంటుంది. అంటే ఇప్పటికి మారినవారు గాని మారవలసినవారు గాని మొత్తంమీద ఇటు 20 లక్షలూ అటు 20 లక్షలూ ఉంటారన్నమాట. చివరకు ఈ సంఖ్య ఎక్కువే కావచ్చు. ఏమైనా ఈ సమస్య చాలా భయంకరమైనది. అయినప్పటికీ అన్నిటికంటే దీనికే మేమెక్కువ ప్రాముఖ్యం ఇచ్చాము. లేకుంటే వీరందరూ స్వస్థలాలలో బాధపడవలసి వస్తుంది" అని భారత ప్రధాని పండిట్ నెహ్రూ నేడు జరిగిన పత్రికా ప్రతినిధి సమావేశంలో ప్రకటించాడు.



ఢిల్లీ కల్లోలాలలో మరణించినవారి సంఖ్య ఏవిధంగాచూచినా వెయ్యికి మించదని అధికార, అనధికార వర్గాలవారి అంచనాలు తెలుపుతున్నట్లు కూడా విదేశ వార్తాసంస్థల అతిశయోక్తులను ఖండిస్తూ పండిట్ నెహ్రూ వెల్లడించాడు. ప్రాక్పశ్చిమ పంజాబులలో మొత్తం 15000 మంది మరణించినట్లు అధికార వర్గాల అంచనా తెలుపుతోంది గాని తమ ఉద్దేశంలో ఈ సంఖ్య చాలా అల్పమనీ నిజంగా మరణించినవారు తేలికగా దీనికి రెండింతలో మూడింతలో ఉండవచ్చుననీ పండిట్ నెహ్రూ అన్నారు.

కాందిశీక సమస్య ఎంత తీవ్రమైందో వివరిస్తూ నెహ్రూ ఇల్లా అన్నారు.

"జనాభా మార్పుదల సాగించాలని మేమెన్నడూ అనుకోవడం లేదు. అయినా పరిస్థితుల ఒత్తిడివల్ల మేమీ విధిని నిర్వహించవలసి వచ్చింది.

ఇండియాలో ఆహార పరిస్థితి చాలా క్లిష్టంగా ఉన్నప్పుడు ఈపని జరుగుతోంది. అనేక ఇతర దేశాల్లో మాదిరిగానే ఇండియాలో కూడా ఆర్థిక సమస్య ఇప్పుడు చాలా తీవ్రమైంది. అందుచేత మన మిప్పుడెదుర్కొంటున్న సమస్య ఎంత తీవ్రమైనదో మీరు గ్రహించగలరు. ఈ కాందిశీక సమస్యను సమర్థతతో పరిష్కరించడానికి ఒక ప్రత్యేక సంస్థను నెలకొల్పాము. ఈ సంస్థద్వారా పోషణ మరింత తృప్తికరంగా పరిష్కరించగలమని అనుకుంటున్నాను.

కాందిశీకుల ఆగమనంవల్ల ప్రస్తుత తాత్కాలిక కల్లోలం ఉపశమించడంతోనే ఉత్పన్నమయ్యే సమస్యలు అనేకం ఉన్నాయి. నేడు ఢిల్లీ శిబిరాల్లో ఉన్న అసంఖ్యాక జనసమూహాలను ఏంచెయ్యాలి? ఇటువంటి వాటిని శాంతమనస్కతతో పరిష్కరించుకోవలసి ఉంటుంది. ఏ పరిష్కారమైనా వారి అభీష్టాన్ని కూడా ఆదరించేదిగా ఉండాలి."

మంత్రివర్గ సంఘంలో ఏర్పడిన అత్యవసర సంఘం, ఢిల్లీ అత్యవసరసంఘం మొదలైన నూతన సంస్థలు ఏవిధంగా ఈ సమస్య విషయంలో కృషి చేస్తున్నదీ వివరించి తూర్పు పంజాబు పరిపాలనా యంత్రాన్ని గూర్చి పండిట్ నెహ్రూ ఇల్లా అన్నారు.

#### ప్రభుత్వం చేస్తున్న పని

"పంజాబు విభజనతో తూర్పుపంజాబ్ ప్రభుత్వనిర్మాణంలో అనేక క్లిష్టసమస్యలను ఎదుర్కోవలసివచ్చినది. అక్కడ అన్నీ కొత్తగా నెలకొల్పవలసినదే. వీటి కన్నింటికీ కేంద్రప్రభుత్వం పూర్తిగా సహాయం చేస్తామని వాగ్దానం చేసింది. వారం పదిరోజుల నైనకార్యక ఇదికూడా చాలదనీ కేంద్రప్రభుత్వ అజమాయిషీ ఇంకా ఎక్కువ ఉండాలనీ నిశ్చయించి మంత్రివర్గ అత్యవసరసంఘాన్ని నియమించి దాని కర్తవ్యకృత పరిశీలించవలసిందని గవర్నరుజనరలును ఆహ్వానించాము. అందులో పాల్గొనవలసిందని వివిధ శాఖాధిపతులనూ ప్రముఖపౌరులనూ ఆహ్వానించాము.

అసలు సంగతేమిటంటే ఈ సంఘటనలన్నీ మాకు చాలా ఆకస్మాత్తుగా తెలి

(8-వ పేజీ చూడుడు)

జమీందారీ రదు శిస్తు తగ్గింపుబిల్లుల పూర్తిపాఠం 2 వ పేజీలో.

### "పరిస్థితుల బాగుచేస్తాను; లేదా ఆ ప్రయత్నంలో మరణిస్తాను"

#### ముస్లిం కాందిశీకులకు గాంధిజీ హామీ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 13: "నే నిప్పటి పరిస్థితులను బాగుచేస్తాను, లేదా ఆ ప్రయత్నంలో మరణిస్తాను" అని మహాత్మాగాంధీ పురాణ ఖిల్లాలో ముస్లిం కాందిశీకులకు ఉపన్యసిస్తూ ఉద్ఘాటించారు.

తాను ఢిల్లీకి వచ్చింది కాందిశీకులకు సౌఖ్యావాసం కల్పించడంకోసమూ, పరిస్థితులను చక్కబరచడంలో ప్రయత్నించి కృతకృత్యులు కావడమో లేదా మరణించడమో ఏదో ఒకటీ తమ సందేశమని వారికి తెలియ చెయ్యడంకోసమూ అని చెప్పి మహాత్మజీ వారికి హామీ ఇచ్చారు. ఈ ఆదర్శం సఫలం కావాలంటే ఢిల్లీలో ఒక్క మహమ్మదీయులకే కాక అన్ని మతాలవారికీ సంపూర్ణ శాంతి భద్రత లుండాలి.

మహాత్మాగాంధీని వేలకొలది ముస్లింలు చుట్టిపేరారు. తాను చేయవలసిన అత్యవసర కార్యాలు ఎన్నో వున్నాయనీ, వారి సంరక్షణకోసమే తమ కాలం యావత్తూ వినియోగించవలసివుందనీ చెప్పి వారి దగ్గర నుంచి సెలవు తీసుకొని గాంధీజీ తమ మకాముకు వెళ్లారు.

డా॥ దిన్షా మెహతాతోపాటు గాంధీజీ వెంట వెళ్లిన దివాన్, చమన్‌లాల్ గారు మహాత్ముడు చెప్పిన మాటలనే మరింత విస్తరగా జనసమూహానికి వినిపించేట్లు చెప్పారు. జనంలో చాలామంది 'మహాత్మా గాంధీకి జై', మహాత్మాగాంధి జిందాబాద్ అని నినాదాలు చేశారు.

పురాణా ఖిల్లాలో ముస్లిం స్త్రీ బాల పురుషులు దాదాపు 50 వేలమంది ఉన్నారు. రోజు రోజుకూ ఇంకా ఎక్కువమంది వస్తున్నారు. సరియైన ఆహార వస్త్ర సౌకర్యాలు లేక చాలా అనారోగ్య పరిస్థితులలో ఇక్కడి కాందిశీకులు నివసిస్తున్నారని కొందరు అన్నారు.

కేటియించి ఈ శిబిర సంరక్షణ బాధ్యతను భారత ప్రభుత్వమే స్వీకరిస్తుంది. మహాత్మాగాంధీ ఇక్కడికి రావడానికి కొంచెం ముందుగా సహాయ శిబిరాధికారులుగా మహమ్మద్ భట్, ఎ. హెచ్. రజా అను ఇద్దరు ముస్లిం ఉద్యోగులు నియమింపబడ్డారు.

## "జనాభా మార్పుదల కేవలం అవివేకం"

### ప్రార్థనసభలో గాంధిజీ ఉద్బోధ

#### "కాందిశీకులు స్వస్థానాలకువెళ్లి నివసించాలని నిశ్చయించుకోవడమే నిజమైన పరిష్కారం"

న్యూఢిల్లీ, సెప్టెంబరు 13: "పెద్ద ఎత్తున జనాభా మార్పులాననంకంటే ఆత్మనాశక కృత్యం మరొకటి ఉండదు. అందువల్ల ఉభయులకూ మరిన్ని అనర్థాలు కలుగుతాయి. ఇది అందరికీ లజ్జాకరం. నా మటుకు నేను అన్ని మతాలవారికీ సమానంగా సేవ చేసేవాడనని భావిస్తున్నాను. ఇండియాపాకిస్థాన్ ప్రభుత్వాలు రెండూ జనాభామార్పు సాగించవద్దని నిశ్చయించుకోవడం నా కోరిక ఇష్టం. ఈ కలహంవల్ల విపరీతంగా కష్టాలు పొందిన హిందూ ముస్లింలు నాతో మొరపెట్టిన విషాదగాథ లెన్నో వినువిన్నాను. దీనికంతకూ పారిపోయి అన్యప్రదేశాలకు వచ్చిన సర్వవర్గాలవారూ తమ తమ గృహాలకు వెళ్లి శాంతంగా స్నేహభావంతో నివసించాలని నిశ్చయించుకోవడమే సరియైన పరిష్కారం. తాత్కాలికంగా నచ్చిన ఈ ఉన్మాదాన్ని శాశ్వతత్వం గా పరిగణించకూడదు [illegible]. తమ తమ ప్రాంతాల్లో ఉన్న అల్పసంఖ్యాకులను పూర్తిగా రక్షించవలసిన బాధ్యత ఉభయాధినివేశ ప్రభుత్వాలమీదా ఉన్నది. వారి కపుడు ఈ సమస్యవిషయమై తమలో తాము చర్చించుకొని పరిష్కారానికైనా రావాలి. లేదా ప్రపంచానికి తమ సామర్థ్య లోపం తెలియచేసి ఏ మధ్యవర్తిత్వానికైనా ఒప్పుకోవాలి [illegible] ... అసహనం ... కూడదు" అని ... సమావేశంలో మహాత్మాగాంధీ ... మార్పువిషయమై విమర్శించారు.

తెగాని మహాత్మాగాంధీ భారత సమాఖ్యనుండి ముస్లింలు వెళ్లిపోవాలని ... సహాయం ... అవసరం ... జిన్నాగారి ... చేసిన విజ్ఞప్తిని ... అన్నారు.

"జిన్నా చేసిన విజ్ఞప్తితో పాకిస్థాన్‌లో ముస్లింలు చేసిన అకృత్యాలను ఈషన్మాత్రమైనా స్పృశించలేదని చెప్పవలసి వచ్చినందుకు నాకు చాలా విచారంగా ఉన్నది. తమ తమ రాజ్యాల్లో ఉన్న అధికసంఖ్యాకవర్గాలు చేసిన అకృత్యాలను ఆయా ప్రభుత్వాలు దాపరికం లేకుండా ధైర్యంతో ఒప్పుకోవాలి. ఉన్న విషయాన్ని కప్పిపుచ్చడంవల్ల ప్రయోజనంలేదు.

భారతసమాఖ్యలో ఉన్న ముస్లింలందరూ పంచమాంగదళంగా పనిచేస్తున్నారని నాతో చాలామంది అన్నారు. అందరూ అలాంటివారే అని నేనెన్నడూ నమ్మను. సమాఖ్యలో 4½ కోట్ల ముస్లింలు ఉన్నారు. వీరందరూ ఇంత దుర్భరంగా ప్రవర్తిస్తున్నట్లయితే వారు తమ ఇష్టానుసారానికే గొయ్యి తవ్వుకుంటున్నారని నా ఉద్దేశం.

లేక్‌సక్సెస్, సెప్టెంబరు 13: సోమవారంనాడు భద్రతాసంఘ సమావేశమై, గ్రీస్ సమస్యను సర్వసభ్య సమావేశము చర్చించవలసినదని సిఫార్సు చేయవలెనని అమెరికా చేసిన సూచనను చర్చించును.

### 8 లక్షలమంది శరణాగతులు

#### కాలినడకన తూర్పు పంజాబుకు ప్రయాణం

అమృతసరు, సెప్టెంబరు 13; సైనికుల సహాయంతో 8 లక్షలమంది మహమ్మదీయేతర శరణాగతులు పశ్చిమ పంజాబు జిల్లానుండి తూర్పుపంజాబుకు కాలినడకను బయలుదేరినని శరణాగతులను తీసికొని వచ్చుట కేర్పరుపబడిన సైనికసంస్థ కార్యాలయమునకు వార్తవచ్చినది. ఇంత గొప్ప శరణాగతి బృందము ప్రపంచములో నిదివరకెన్నడు బయలుదేరి యుండలేదు.

(అ. ప్రె)

### బెంగుళూరులో కర్‌ఫ్యూ ఉత్తర్వు

బెంగుళూరు, సెప్టెంబరు 13: ఇక్కడ ఆదివారం ఉదయం 6గంటల మొదలు సోమవారం ఉదయం 6 గంటల వరకూ 24 గంటల కర్‌ఫ్యూ ఉత్తర్వు అమలు జరుపుచున్నారు. నేడు చెలరేగిన అల్లరిలో ఐదుగురు గాయపడ్డారు. వీరిలో ఒకడు ఆస్పత్రిలో మరణించాడు. ప్రజాసమూహం హద్దుమీరి ప్రవర్తించి నందున 9మంది పోలీసులు గాయపడ్డారు

# నిజాంసంస్థాన హిందూమహాసభ సత్యాగ్రహ సన్నాహం

## కోర్కెలను ముందు నవాబుగారికి తెలపాలని కార్యాచరణసంఘనిర్ణయం

[‘ఆంధ్రపత్రిక’ విలేఖరి]

హైదరాబాదు, సెప్టెంబరు 12: “నిజాం సంస్థానం భారత సమాఖ్యలో చేరవలెను. సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వ సూత్రాలు హిందువులకు లభ్యం కావలెను. పౌరస్వాతంత్ర్యం సమకూర్చవలెను” అనే తమ కోర్కెలు సాధించుకొనేటందుకు సత్యాగ్రహోద్యమం ప్రారంభించడానికి ముందు వీటిని ముందు నవాబుగారికి నివేదించవలెను” అని హిందూమహాసభ స్థాయిసంఘమువర్కింగ్ సమావేశమై తీర్మానించారు. కార్యాచరణ సంఘంలో కొన్ని మార్పులు చేస్తూ, యశ్వంతరావు జోషీ గారిని ఆ సంఘాధ్యక్షులుగా నియమించారు. తమ కోర్కెలు నెరవేరుటకు అవసరమైన చర్యలు తీసుకొనే అధికారం ఆయన కిచ్చారు. తాము ఇదివరలో ఆపుచేసిన ఉద్యమం తిరిగి ఎందుకు ప్రారంభించబోతున్నదీ ప్రజలకు తెలుపవలెనని వర్కర్లకు ఆదేశించారు.

వీరి కోర్కెల నివేదిక “షేషమ్ కారక్” లో నవాబుగారికి ఈ నెల 9 న వ్రాసారు.

సంస్థాన కాంగ్రెస్ కార్యాచరణ సంఘం అధ్యక్షుడు శ్రీ దిగంబరరావు బిందూగారు హిందూమహాసభ నాయకులను కలుసుకొని మాట్లాడడంలో ఇంతవరకూ విజయం సాధించారని స్థానిక ఉర్దూపత్రిక ఒకటి 11 వ తేదీన ఒకవార్త ప్రచురించింది. ఆవార్త నిరాధారమైనదనీ అపోహలకు ఎడమిచ్చుచున్నదనీ సంస్థాన కాంగ్రెస్ కార్యాలయంవారు జెడొక ప్రకటనచేశారు.

## సత్యాగ్రహుల అరెస్టు

సత్యాగ్రహం చేసినందుకుగాను ఉమెనాలో 150 మందీ, ఉద్గిరిలో 9 మందీ, ఉస్మానాబాదులో 9 మందీ, బాగోశిజిల్లాలో 9 మందీ, పట్టణంలో 9 మందీ అరెస్టయినట్లు సంస్థాన కాంగ్రెసు కార్యాలయం ప్రకటనవల్ల తెలుస్తున్నది. వార్తలో ఆబ్కారీ శాసనోల్లంఘనంలో 1200 ఈతచెట్లు కొట్టివేయబడినవి.

## ఔరంగాబాదులో నిర్బంధ ఉత్తరువు

ఔరంగాబాదుజిల్లా పోలీసుసూపరింటెండెంటు, ఔరంగాబాదు మునిసిపాలిటీ హద్దులలో 11-వ తేదీనుంచి వారంరోజుల వరకూ హైదరాబాదు పోలీసుఆక్టు 23-వ సెక్షన్ ప్రకారం ఒక నిర్బంధ ఉత్తరువు అమలు చేశారు. ఆ ఉత్తరువు ప్రకారం ఆపట్నంలో వారంరోజులవరకు ఎక్కడా నలుగురికంటే ఎక్కువమంది సమావేశం కావడంగానీ, ఊరేగింపులు జరపడంగానీ నినాదాలు చేయడంగానీ, జరగరాదు.

నిన్నను ఔరంగాబాదు విద్యార్థులు ఒక అసమ్మతి ప్రదర్శనం జరిపారు. హైదరాబాదులో ఇటీవల విద్యార్థులపై జరిగిన లాఠీచార్జికి అసమ్మతిగా ఈ ప్రదర్శనం జరిగింది. ఈ సందర్భంలో ఊరేగింపుకూడా జరిగింది. పోలీసులు ఊరేగింపులో నడిచారు. కాని, ఆటంకపెట్టలేదు.

## ఇల్లెందు సత్యాగ్రహులపై అభియోగం

ఖమ్మంమెట్టు, సెప్టెంబరు 11: సంస్థాన కాంగ్రెసు ఆదేశానుసారం ఆగస్టు 15 వ ఇల్లెందులో భారత పతాకాలను ఆవిష్కరించి అరెస్టయిన యర్లాప్రగడ కృష్ణమూర్తి, చేపూరి వెంకన్న, నరేంద్రుల మల్లికార్జునరావుగార్లను నిన్న వరంగల్లు సెంట్రల్ జైలు నుంచి ఇల్లెందు మేజిస్ట్రేటు కోర్టుకు తీసుకువచ్చారు. వీరిపై అభియోగం పెట్టారు. విచారణ వాయిదాపడింది. తిరిగివరంగల్లు తీసుకువెళ్లారు. ఖైదీలను చూచేందుకు ఇల్లెందు స్టేషన్ వద్ద పలుమంది ప్రజలు వచ్చారు. వీరు ప్రజలకు కనబడకుండా చేయాలని పోలీసులు యత్నించారు కాని ప్రయోజనం లేకపోయింది. స్వ. వి.

## పరకాల, హుజూరాబాద్ సంఘటనలు

### కాంగ్రెస్‌నాయకులప్రకటన

హైదరాబాద్, సెప్టెంబరు 12: బూర్గుల రామకృష్ణారావు, కొండా వెంకటరంగారెడ్డిగార్లు పరకాల, హుజూరాబాద్ పట్నాలకు వెళ్లి అక్కడ ఈ మధ్య జరిగిన సంఘటనల విషయమై పరిశీలన చేసి ఈ దిగువ ప్రకటన చేశారు. సెప్టెంబర్ 8 న మేము హనుమకొండ వెళ్లి శ్రీ ఎం. రామకోటేశ్వరరావుగారితో కలిసి పరకాల వెళ్లాము. అక్కడికి వెళ్లేముందు, పరకాలసంఘటనలో గాయపడి, హనుమకొండ ఆస్పత్రిలో చికిత్స పొందుతున్న వారిని చూడటం మంచిదనుకొన్నాము. ఆ ఆస్పత్రిలో స్థానిక తహసీల్ లో చప్రాసీగా ఉన్న ఒకరిని బంధువైన ఒక ముస్లిం దుర్రవాడుకూడా వున్నాడు. అతని పేరు అబ్దుల్ రహీమ్. అతనికి కాళ్ళల అతడు గాయపడ్డాడు. మిగతవారు పరకాలచుట్టుపట్లనున్న నగరం, కనపర్తి రాయునంద మొదలైన గ్రామాలవారు.

వాస్తవంగా జరిగిందేమిటంటే ఆగస్టు 7, 14 తేదీలలో సంస్థాన కాంగ్రెసు కార్యక్రమం ప్రకారం పరకాలలో భారత పతాకావిష్కరణోత్సవాలు జరిగాయి. గ్రామస్థులు బహుసంఖ్యాకులు ఉత్సవాలలో పాల్గొన్నారు. ఆ ఉత్సవాలను కేశవరెడ్డి అనే ప్రముఖ కాంగ్రెస్‌వాది నిర్వహించారు. ఆయననూ, మరి కొందరినీ పోలీసులు అరెస్టు చేశారు. కేశవరెడ్డిగారు రెండు పర్యాయాలు విజయవంతంగా పతాకావిష్కరణోత్సవాలు జరపటం స్థానిక ముస్లిములకూ, పోలీసులకూ కంటగింపైంది. పగ తీర్చుకోవడమెట్లాగా అని కాచుకు కూర్చున్నారని పిస్తుంది. సెప్టెంబరు 2 పతాక దినోత్సవం నాడు, కేశవరెడ్డిగారు విడుదల అయ్యాడనీ, ఆయన నాయకత్వాన పతాక ఉత్సవం జరుగుతుందనీ అబద్ధప్రచారం జరిగినట్లు తెలుస్తుంది. చాలామంది చెప్పిందేమిటంటే, స్థానిక ముస్లింలలో ప్రముఖుడైన మహమ్మద్ కాసిం అనే అతని ప్రోద్బలంతో ఈ అబద్ధ ప్రచారం జరిగిందని, అతనికి పోలీసు అధికారులు వంతు చేశారట. కేశవరెడ్డిగారి సంతకం ఫోర్జరీచేసి గ్రామాలకు ఉత్తరాలు కూడా పంపినట్లు తెలుస్తుంది. 145 వ సెక్షను అమలులో వుంది. కనుక నిరాయుధులుగా రమ్మని ఆ ఉత్తరాలలో ఉందిట. ఈ ఉత్తరువు పరకాలలోనూ, పరిసరగ్రామాలలోనూ ఆగస్టు 31 నుంచీ అమలు చేశామని సబిన్‌స్పెక్టరు చెప్పారు. సెప్టెంబరు 2 వ తేదీ మధ్యాహ్నం చుట్టుపట్ల ఏడెనిమిది గ్రామాల నుంచి, ఏడెనిమిదివందలమంది కలిసి ఊరేగింపుగా పరకాలలో మామూలుగా పతాకోత్సవాలు జరుగుతూ వచ్చిన బహిరంగ ప్రదేశానికి బయలుదేరారు. ఊరేగింపు ఒక సందుగుండా వెళుతూండగా, సబిన్‌స్పెక్టరు రిజర్వు పోలీసులతో వచ్చి కాల్పులు ప్రారంభించాడు. తక్షణమే ఊరేగింపులోని 5 గురు చనిపోయారు. కాల్పులమూలాన జనసమూహం దశదిశలకూ చెల్లాచెదరైపోయింది. తలదాచుకొనే వుద్దేశంతో ఏ యిల్లు తెరచిపెట్టె ఆ యింట్లో దూరబడ్డారు. స్థానిక ముస్లిములు సుమారు 200 మంది తుపాకులూ, కత్తులూ, కర్రలూ పుచ్చుకొని ఆ జనాన్ని వెంబడించి ఇళ్ళల్లో దాక్కొన్నవారిని బయటికి ఈడ్చి కనికారం అనేది లేకుండా కొట్టారు. ఎంతమంది గాయపడ్డారు, ఆస్పత్రిలోనూ, పోలీసులద్వారానూ తెలియవచ్చినదాన్నిబట్టి మొత్తం 10 మంది చనిపోయారు. వారిలో ఇద్దరు ఆస్పత్రిలో చనిపోయారు. మిగతా ఎనమండుగురి శవాలలో ఒకటి, ఈ సంఘటన జరిగిన ప్రదేశానికి ఒకటి రెండు ఫర్లాంగుల దూరంలోనూ, మరొకటి పొలాలలోనూ దొరికాయి. దీనినిబట్టి ఆ వ్యక్తులను వెంబడించి, తరిమిచంపివేసినట్లు స్పష్టపడుతోంది. ఆస్పత్రిలో ఇన్‌పేషంట్లుగా వున్న 30 మందికి తీవ్రమైన గాయాలు తగిలాయి. వారిలో కొందరికి తగినవి కత్తులగాయాలు. చాలామందికి కర్రలతో కొట్టడంవల్ల శరీరాలు కందికట్టిపోవడం, ఎముకలు విరగడం జరిగింది. మొత్తం ఎంతమంది చచ్చిపోయారో, ఎంతమంది గాయపడ్డారో ఆ ఏడెనిమిది గ్రామాలలో వెళ్ళిచూసివస్తేగాని ఖచ్చితంగా చెప్పలేము. స్థానికులు సంగతి సందర్భాలు బాగా తెలిసినవారు అనేదేమిటంటే, 30 మంది చనిపోయారనీ, 150 మంది గాయపడ్డారనీ.

సాయుధులైన జనంవచ్చి ముస్లిములను ముట్టడించారనీ, పోలీసు ముఖ్యాధికారి ముస్లిం స్త్రీలు గాయపడి ఆస్పత్రిలో చేర్చబడ్డారనీ ఇత్తెహాదుల్ ముస్లిమీన్ చేస్తున్న ప్రచారం శుద్ధ అబద్ధం. ముస్లిములలో మగవారు కానీ, ఆడవారు కానీ—అబ్దుల్ రహీం అనే దుర్రవాడు తప్ప—ఒక్కరు కూడా గాయపడటంగానీ, ఆస్పత్రిలో చేర్చబడటంగానీ జరుగలేదు. పరిసర గ్రామాల ప్రజలను 117 మందిని అరెస్టుచేసి జైలులో పెట్టారు. వారిలో ముగ్గురు నలుగురు తప్ప తక్కినవారందరికి శరీరాలపైనా దెబ్బలు కనబడుతున్నాయట. అప్రాంతానికి ప్రత్యేక మేజిస్ట్రేటును నియమించారు. మేము వెళ్లినప్పుడు పోలీసులు, సైనికులూ గస్తీలు సాగిస్తూనే వున్నారు. ఈ హత్యలకూ, గాయాలకూ కారణమైన ఏ ఒక్కరినీ ఇంతవరకూ అరెస్టుచేయ్యలేదు. పరిసర గ్రామాలు అట్టుడికినట్టుడికి పోతున్నాయి. ప్రజలు రక్షణ నిమిత్తం దూర ప్రదేశాలకు వెళ్లిపోయారు.

## హుజూరాబాద్

ఆగస్టు 26 న హుజూరాబాదులో జరిగిన సంఘటనను పురస్కరించుకొనే పరకాలలో ఈ సంఘటన జరిగినట్లు తెలుస్తుంది. అప్పుడు అక్కడి సయ్యద్ ఉద్దీన్ ఖాన్ అనే సర్కిల్ ఇన్‌స్పెక్టరు చంపబడ్డాడు. మేము ఈ 9 వ తేదీన హుజూరాబాద్ వెళ్లాము.

అక్కడ జరిగిన దేమిటంటే, ఆరోజున ఆ చుట్టుపట్ల గ్రామాలకు చెందిన 6 గురు యువకులు పూలమాలలతో ఆ ప్రాంతపల్లి, రైతు జాతీయ పాటలు పాడుకొంటూ వీధులలో తిరిగారు. ఒక అరబ్బు అది చూసి కంటగించుకొని వారిలో ఇద్దరిని కొట్టాడు. తర్వాత వారిని సర్కిల్ ఇన్‌స్పెక్టరువద్దకు తీసుకుపోవడం, బాగా బాదడం, ఖవటెపెట్టటం జరిగింది. ఆ యువకులు వారిగ్రామాలకు వెళ్లి జరిగిన సంగతి చెప్పగా ప్రజలు ఉద్రిక్తులైనారు. దానిపైన చుట్టుపట్ల వారు గ్రామాల ప్రజలు ఏకమై, కాంగ్రెసు నినాదాలు చేసుకొంటూ హుజూరాబాద్ వెళ్లారు. క్రిందటిరోజున యువకులు ఏమి చేసినందుకు హింసించబడ్డారో ఆ రోజున వారంతా అదనే చేదామని సంకల్పించారు. ఆప్రదర్శనం శాంతిగా సాగేపద్ధతులో జోక్యంచేసుకోవద్దనీ మేజిస్ట్రేటు సర్కిల్ ఇన్‌స్పెక్టరుకు సలహా ఇచ్చాడని మాకు తెలిసింది. కాని సర్కిల్ ఇన్‌స్పెక్టరు వారిని నిరోధించడానికే తలపెట్టాడు. అరబ్బూ, పోలీసులుంగమూ స్థానిక మునసబ్ కోర్టు సమీపంలోని ఒక ఎత్తైన ప్రదేశం మీదను చేరుకొని, జనసమూహాన్ని అటకాయించి, చెదరగొట్టడానికి నిశ్చయించారు. సమూహాన్ని చెదరగొట్టేందుకు ముందు సర్కిల్ ఇన్‌స్పెక్టరే గాలిలోకి తుపాకి పేల్చాడు. కాని వారు చెదరి పారిపోనందున వారిమీదనే కాల్పులు జరిపాడు. కొంతమంది గాయపడ్డారు. గాజ్ల లక్ష్మయ్య అనే వారు కూడా గాయపడ్డారు. అదృష్టవశాత్తు ఆయన బ్రతికారు. ఇదైన తరువాత పోలీసులూ, సబ్ ఇన్‌స్పెక్టరూ వెనక్కు తగ్గి పారిపోయారు. సర్కిల్ ఇన్‌స్పెక్టరు అక్కడే ఉండి, ఇంకా కొన్ని సార్లు సమూహంపై కాల్పులు జరిపాడు. కాని దురదృష్టవశాత్తు అతడు కిందపడిపోవడం రోషావేశమైవున్న సమూహం కర్రలతో అతని మీదికి పోయి బాదడం, అతను చనిపోవడం జరిగింది. తర్వాత, వానమూలంగా ఒక వంచను తలదాచుకొనివున్న ఒక ముసలివాని అరబ్బులు కాల్చి, తర్వాత ముక్కలు ముక్కలుగా కోసేశారు.

గ్రామాలలో యింకా పోలీసులూ, సైనికులూ గస్తీ తిరుగుచున్నారు. ప్రజలు భీతావహులైపోయారు. మాకారు కనిపించడంతోడనే పానవలెత్తి పారిపోవడం మొదలుపెట్టారు. వారిని ఆకర్షించి సంగతి సందర్భాలు తెలుసుకోవడమే చాలా కష్టమైపోయింది. పోలీసులు పటేల్ పట్వారీలను హింసిస్తున్నారు. వారిలో కొందరిని డిస్మిస్ చేయడం, కొట్టడంకూడా జరుగుతోంది. వారే ప్రజలను ప్రోత్సహిస్తున్నారనే అనుమానంతో కొంతా, ప్రజలనుగురించిన భోగట్టా తెలుసుకొనడానికి కొంతా ఈ హింస జరుగుతోంది. కొందరు మతేన్‌దారులు ఊరు విడిచి వెళ్లిపోయారు. ఇంతవరకు దాదాపు 400 మంది ప్రజలను అరెస్టు చేసినట్లు తెలిసింది.

ఈనాడు సంఘటనలవల్లా, దౌర్జన్యం వల్లా దౌర్జన్యం చెలరేగి అరాజకమేర్పడుతుందని స్పష్టపడుతోంది. దేశానికి అది వినాశకరమని తేలుతుంది. నిజం చెప్తే సత్యాగ్రహంగా ఉండవచ్చుకాని, రాజకీయ పోరాటంలో మతవిద్వేషం సృష్టించడానికి పకడ్బందీ ప్రయత్నం జరుగుతున్నదని చెప్పక తప్పదు. పోలీసులుకనక నిగ్రహంతో, ప్రజలను ఉద్రేకపరచకుండా, సంస్థానకాంగ్రెస్ ప్రారంభించిన రాజకీయ పోరాటాన్ని అణచివేయడానికి ఒక మతానికిచెందిన సంఘవిద్రోహుల, దౌర్జన్యపరుల సహాయం పొందకుండా ఉంటే ఇటువంటి సంఘటనలు ఇక జరగవని మా నమ్మకం. కాంగ్రెస్‌వారూ, కాంగ్రెసును బలపరిచేవారూ దీక్షతో అహింసామార్గాన ఉద్యమం నిర్వహించాలని మా విజ్ఞప్తి.

## జమీందారీల రద్దు

(1-వ పేజీ తరువాయి)

రయిత్వారీ లెక్కను ఎంతమొత్తం రాబడి యుండునో తెలిసికొనబడును. ఈ మొత్తం రాబడియనగా, ఎస్టేటునుండి ప్రభుత్వానికి, ఆసాములు చెల్లించవలసినవి, పట్టుట, గనులు మున్నగు వాటన్నింటినుండి, ఎస్టేటుతీసుకున్నట్లు ప్రకటించిన తరువాత మొదటి ఫస్లీలో ప్రభుత్వానికి వచ్చురాబడి అంతా చేరును. హాలు ఇనాం గ్రామాలు కాని ఎస్టేటులందు, యీ మొత్తం రాబడిలో (1) శిస్తుది ఖర్చులకు 8 1/3 % వంతు, (2) ఇరిగేషను పనులు కొనసాగించుటకు 5 % వంతు మినహాయించబడును. మిగిలినది ప్రాతిపదిక (బేసిక్) నష్టపరిహార మొత్తంగా లెక్కవేయబడును. హాలు ఇనాం గ్రామాలలో పైకిలికి 8 1/3 + 5% మినహాయించుటే గాక, సాలియానా రెంటు లేదా కట్టుబడులుకూడా మొత్తం రయిత్వారీ రాబడినుండి మినహాయించి మిగిలినదానిలో సగం నష్టపరిహార మొత్తంగా నిర్ణయించబడును.

పరిహారమును నిర్ణయించుటలో ఒక క్రమపద్ధతి ఏర్పాటు చేయబడినది. ఎస్టేట్ విలువను బట్టి పరిహార మొత్తం ఎంత ఇవ్వవలసినది తేలును. చిన్న ఎస్టేట్లకు దానిపై 25 రెట్లు పరిహారములో ప్రారంభించి పెద్ద ఎస్టేట్లకు-క్రమముగా- 12½ రెట్లు తగ్గింపబడును. జమీందారుల కివ్వవలసిన పరిహారమును ప్రభుత్వము జిల్లా కోర్టున కిచ్చెదరు. కోర్టువారు ఆ పరిహారధనముపై ఎవరెవరు హక్కుదారులో విచారించి వారికి ఆ ధనము పంచిపెట్టెదరు. జిల్లాకోర్టు నిర్ణయముపై అప్పీలు చేసుకొనవచ్చును. జమీందారుకు ఇవ్వవలసిన పరిహారము లన్నియు ఎవరెవరికి పంచవలయునో నిర్ణయించుటకు ప్రత్యేక విచారణ సంఘము నియమించబడును. పరిహారధనము అవిభక్తము కాదు. హిందూ సమష్టి కుటుంబపు టాస్తిగనే పరిగణింపవలెను. అయితే ఏవి జమీందారుయొక్క స్వంత భూములో, ఏవి కావో నిర్ణయించుటకు, ఆ ఎస్టేట్ పూర్వచరిత్రను సేకరించుటకు ప్రత్యేక విచారణ సంఘము నియమించబడును. జమీందారీ ఉద్యోగులను వీలయినంతవరకు ప్రభుత్వము ఉపయోగించుకొందురు. వారికి ప్రత్యేక నిబంధనలు ఏర్పరుపబడును.

ఒక ఎస్టేట్‌ను ప్రభుత్వము స్వాధీనము చేసుకొనెనని ప్రకటించిన తరువాత, ఆ జమీందారు శిస్తులను సేకరించు హక్కు రద్దగును. ఆ జమీందారుకు అప్పటివరకు రావలసిన శిస్తు బాకీలన్నియు ప్రభుత్వమునకు సంక్రమించును. బకాయీలను ప్రభుత్వము నియమించిన మేనేజరు వసూలు చేయును. రైతు గడచిపోయిన రెండు ఫసలీల బకాయీలను పూర్తిగ చెల్లించినట్లయితే, అంతకు పూర్వము అతనిపై ఉన్న బకాయీలు రద్దయిపోగలవు. ప్రకటన తరువాత, ‘పేష్కష్’ను జమీందారు చెల్లించనక్కరలేదు.

ప్రాప్రయిటరీలు భూస్వాముల పైని అమలుజరిపే డబ్బు బాకీహక్కులు ఏవైనా ‘ప్రకటనదినము’ నాటికి ఉన్నయెడల వాటి పరిష్కారమునకు పరిహార ధనమే ఉపయోగింపబడును.

### శిస్తును తగ్గించుట

చేరవున్న రైతువారీ శిస్తులమేరకు ఎస్టేటులందున్న శిస్తులను తగ్గించుటకు నిర్దేశింపబడిన రెండవ బిల్లునుగూర్చి ప్రసంగించుచూ మంత్రిగారిట్లనిరి: శిస్తులను తగ్గించుట ఈ సంవత్సరమే జరుగవచ్చును. అయితే ఇంతవరకు రైతువారీ శిస్తులకంటె తక్కువగా ఇవ్వబడుచున్న శిస్తులను పెంచదలచుకోలేదు.

ఎస్టేటుదారులు సాముదాయిక భూములు అడవులు, ప్రయివేటు భూములను అన్యాక్రాంతం చేయకుండా నిషేధించు ఆర్డినెన్సుకు బదులుగా తయారయిన 3 వ చట్టంగూర్చి మంత్రిగారు తెల్పుచు, ఆర్డినెన్సుకి దానికి ఒక్కటేమార్పు గలదనిరి. దాని ఫలితంగా, సాముదాయిక భూములు, అడవి భూముల విషయంలో చట్టం 31-10-39 తేదీనుండి అమలు జరుగును. ప్రయివేటు భూముల విషయంలో 1-11-45 తేదీ నుండి అమలు జరుగును. (అంటే గడచిపోయిన కాలానికికూడా వర్తించును.)

### చట్టం అతిత్వరగ అమలు జరుపబడును

ప్రశ్నలకు జవాబుగా మంత్రిగారు యిట్లు తెలిపిరి:—1802 సం॥లో పెర్మనెంటు సెటిల్మెంటు జరిగినపుడు జమీందారులు మొత్తంరాబడిలో 1/3 వంతే శిస్తు వసూలు ఖర్చులక్రింద తీసుకొనేందుకు హక్కుకలిగి మిగిలినదంతా పేష్కషుగా ప్రభువుకి చెల్లించేవాడు. ఆ మాత్రమునే యీ బిల్లులో అనుసరించితిమి. అతని 1/3 వంతులోనే వసూలు ఖర్చులన్నీ పెట్టుకోవాలి. ఈ ఖర్చులకుగాను ప్రభుత్వంవారు 8 1/3 + 5=13 1/3% వంతు తగ్గించుచున్నారు. అనగా మొత్తం రాబడిలో 1/3 వంతులో 13 1/3% పోతే 20% వంతు ఎంతో అంత మాత్రమే చేసిన పరిహార మొత్తంగా నిర్ణయింపబడును.

పరిహార మొత్తం నిర్ణయించుటలో చిన్న చిన్న భూస్వాములకు ఎక్కువ రెట్లును, పెద్ద జమీందారులకు తక్కువయిచ్చునట్లు క్రమపద్ధతి నిర్ణయించబడెను. జమీందారులకు మేలువరం హక్కుమాత్రమే భూమియందు కలదు. కనుక వానివిలువకే, వారికి పరిహారంగా యిస్తున్నాము. బ్రిటిషు పాలకులకే భూమిలో స్వంతదారులనే హక్కు లేనపుడు, తమకులేని హక్కును జమీందారులకు బ్రిటిషువారెట్లివ్వగలరు? రాజుకు రాజభాగంపైన హక్కు. అందుచే జమీందారులకు మేలువరం హక్కుగాని ఏవిధమైన హక్కు లేదని ఎంచవలెను.

నష్టపరిహారాని కెంత ఖర్చగునో స్థూలంగా చెప్పకోరగా, వివరాలుగాని పనులలో నుండదనిరి. జమీందారులన్ని పర్వేకాలెను. తమకు యిపుడు పరిహార మొత్తం సంఖ్య చెప్పడం కష్టమనిరి. ఎట్లయినా, యితర రాష్ట్రాలకన్న తక్కువే యగును. బీహారులో జమీందారీ ప్రాంతం మదరాసులో కన్న తక్కువే అయినా వారు 45 కోట్లు యివ్వనున్నారనిరి.

కొద్ది నెలల్లోనే యీ చట్టం అమలు జరుగగలదనిరి. జమీందారులు స్థాపించిన విద్యాసంస్థలు తదితర ధర్మసంస్థలన్ని కొనసాగింప అవసరమున్నవన్ని ప్రభుత్వంవారు తీసుకొని కొనసాగింపుదురనిరి. మత సంస్థలను ‘హిందూమతధర్మాదాయముల బోర్డు’ వారు తీసుకోగలరనిరి.

### జమీందారీ సెటిల్మెంటు కమీషనర్

జమీందారీలు రద్దుచేయు కర్మకాండ అంతా పరిపాలించుటకు కమీషనరుగా ఎస్. వెంకటేశ్వరను ఐ. సి. ఎస్. గారు నియమింపబడిరి. సర్వే సెటిల్మెంటు డైరక్టరు వారికివ్వండి కమీషనరుగారికి సహాయం చేయుచుందురు.

## నెహ్రూ సమీక్ష

[1 వ పేజీ తరువాయి]

కాయి. బహుశా ఇది మాతప్పే కావచ్చు. మేము మొదటినుంచీ ఏవిషయాన్నైనా అకస్మాత్తుగా తెలుసుకోవలసిన అవసరం లేకుండా ఉండవలసింది. ఏ ప్రభుత్వంగాని హఠాత్పరిస్థితులను ఎదుర్కోవలసి వస్తే దాని ఫలితాలను అనుభవించక తప్పదు.

పంజాబు దురంతాలు మాకు మొదట్లో తెలిసినప్పుడు వాటినిగూర్చి మేము చాలా తక్కువగా ఊహించాము. రాబోయేది కూడా ఏమంత ఎక్కువగా ఉండదని అనుకున్నాము. ఒకటిరెండుసార్లు ఇల్లా అయినతర్వాత ఈ పంథాశకనుంచి అవలంబించగూడదని నిశ్చయించుకున్నాము. అందుకనే దేశం యావత్తుమీద కల్లోలాల నెదుర్కోవడానికి ప్రత్యేకసంస్థను నెలకొల్పాము. ప్రతివిషయంమీద వెంటనే నిశ్చయం జరుగుతోంది. కడచిన నాలుగైదు రోజుల్లో ఈ సంస్థ అత్యద్భుతంగా పనిచేస్తోంది. ఇకముందు మరింత తృప్తికరమైన ఫలితాలను చూడగలము.”

### వార్తల్లో అతిశయోక్తులు

“ఇండియాలో ఇటీవల జరుగుతున్న సంఘటనలను గూర్చి కొన్ని వార్తాసంస్థలు చాలా అసాధారణంగా ప్రవర్తిస్తున్నాయి. మన దేశంలో ఈ సంఘటనలు రావడమే మిక్కిలి అసాధారణ పరిస్థితులలో వచ్చాయి. వీటికి వీరి అతిశయోక్తులు మరింత విపరీతంగా ఉంటున్నాయి. ఈ మధ్య అమెరికా నుంచి భారత ప్రభుత్వ విదేశాంగ శాఖకు వచ్చిన ఉత్తరంలో ఏదో ఒక వార్తాసంస్థ ఢిల్లీలో మరణించినవారి సంఖ్య 5 లక్షలంటుందని ప్రకటించినట్లు ఉన్నది. ఎంతో ఊహాశక్తి ఉన్నవాడు కూడా ఇటువంటి అతిశయోక్తిని ప్రకటించడం అసంభవం. నాకు తెలిసినంతవరకూ ఈ వార్త ఢిల్లీనుంచి వెళ్లలేదు. ఇంత అసత్యవార్తను ఆ సంస్థకు ఎవరు ఎక్కడనుంచి అందించారో తెలుసుకోవలసిన బాధ్యత దానిదే!

### కల్లోలాలకు కారణమేమిటి?

వీటిని మనం విజయవంతంగా ఎదుర్కోవాలంటే అసలు పరిస్థితిని సరిగ్గా అర్థంచేసుకోవాలి. దీన్ని తవ్వపెట్టుయితే ఇదొక పెద్దగాథ. గతమాసంలో ఇండియాలో జరిగిన సంఘటనలు చాలా అసాధారణమైనవి. ప్రపంచంలో ఎక్కడైనా ఇటువంటి సంఘటనలు అసాధారణమయితే ఇక్కడ అంతకంటే అసాధారణం. ఎందుచేతనంటే నిజానికి ఇండియా శాంతియుతమైనదేశం. ఈ దేశంలో ప్రజలు నల్లినీ దోమనూ చంపడానికికూడా మామూలుగా సంకోచిస్తారు. అటువంటివారు ఇంతటి ఘాతుక కృత్యాలకు పూనుకున్నారంటే వారిమనస్థితినే సంపూర్ణంగా మార్చివేసిన భయంకర సన్నివేశంగాని సన్నివేశపరంపరలుగాని ఉండి ఉండాలి. వాటిని మనం అర్థం చేసుకుంటేగాని ఈ పరిస్థితిని సరిగా ఎదుర్కోలేము.

విదేశ పత్రికల్లో వార్తలు చూస్తుంటే ఒక విషయం కనబడుతోంది. అసలు ఈ కల్లోలాలకు పూర్తిగా కాకపోయినా అధికభాగం సిక్కులే కారణమని అవన్నీ ఆరోపిస్తున్నాయి. ఇది సిక్కుల యెడల అన్యాయం. సిక్కులు ఇతరులు చేసినట్లుగానే ఎన్నో అకృత్యాలు చేశారనడంలో సందేహం లేదు. కాని వారేదీనికి పూర్తిగా కారకులనడంకంటే అసత్యం మరొకటిలేదు.

### ఆగస్టు 16 ఆదిబీజం

ఈ సంఘటనలకు గతసంవత్సరం ఆగస్టు 16 వతేదీన కలకత్తాలో జరిగిన సంఘటనే ఆదిబీజం, దానివెంబడి నవఖాలీ వచ్చింది. తర్వాత ప్రతిచోటా ఎక్కువైందే గాని తగ్గలేదు. కేవలం రాజకీయమే తాండవించింది. దానితో బీహారులో తీవ్ర ప్రతీకార చర్యలు ప్రారంభించాయి. అక్కడ ఒక విధంగా సామాన్య ప్రజానీకమే ప్రతీకార బుద్ధితో చెలరేగింది. అయినా దాన్ని వారం రోజులలో అణచివెయ్యగలిగాం. ఆ పరిస్థితులలో ఏ ప్రభుత్వమైనా అంతకంటే సమర్థతతో ప్రవర్తించలేదు.

ఈసంవత్సరం మొదట్లో పంజాబ్ సంక్షుబ్ధరంగమయింది. రావల్పిండి, ముల్తాన్, లాహోర్, అమృతసర్ పరిసరాలూ, హజారా జిల్లావంటి భాగాలు ఈమత విద్వేషాలకు గురి అయ్యాయి. ఈప్రదేశాలలో ఎన్నో గ్రామాలు అగ్నిదగ్ధమయ్యాయి. అక్కడ ఎన్నెన్నో అమానుష కృత్యాలు జరిగాయి. అప్రజ్వలనం ఈకల్లోల చరిత్రలో కొత్తమార్పు తెచ్చింది. ఎందుచేతనంటే అప్పుడే అక్కడినుంచి ఎంతమందో ప్రజలు ఇతర ప్రదేశాలకు వలస వెళ్లారు. అప్పుడు ఇప్పుడు కనబడుతున్నంత తీవ్రంగా లేదు. అయినప్పటికీ ఆ ప్రజ్వలనం పరిగణింపదగ్గదే. దాదాపు మూడు 4 లక్షలమంది అప్పుడు ఢిల్లీ, యు. పి. మొదలైన ప్రదేశాలకు వచ్చి ఉంటారు. ఈలోగా అమృతసర్ లో లాగానే లాహోర్ లో కూడా కల్లోలం సాగుతూనే ఉన్నది.

ఈదురదృష్ట సంఘటనలు అప్పుడు చిన్న ఎత్తున సాగాయి. ఇప్పుడు పెద్ద ఎత్తున సాగాయి. పంజాబులో ఉభయ వర్గాలూ సమానంగా దీకొన్నాయని చెప్పవచ్చు. ఆసమానతే లేకపోతే పరిస్థితి మరింత విపరీతమౌతుందని అప్రజలు భావించారు.

ఇల్లా కల్లోలం సాగుతున్న రోజుల్లో పంజాబు విభజన వచ్చింది. దానిలో తూర్పున మహమ్మదీయులకూ, పడమట మహమ్మదీయేతరులకూ ఎంత మాత్రమూ రక్షణ ఉండదని ప్రజల్లో భయోత్పాతం ప్రబలింది. హిందూసిక్కులకు రావల్పిండి ముల్తాన్, లాహోరు దురంతాల అనుభవమున్నది. మహమ్మదీయులకు అమృతసర్ జిల్లా అనుభవమున్నది.

వెంటనే లాహోరులో కల్లోలం ప్రారంభమయింది. అక్కడ నిజంగా కనబడ్డ ప్రతిసిక్కునూ పురుగులనేరినట్లు ఏరివేశారు. హిందువులనుకూడా మహమ్మదీయులు శత్రువులను చూచినట్లే చూచారు. ఈ విధంగా ప్రాక్పశ్చిమ పంజాబులు రెంటిలోనూ సాగింది.

ఇంతలో దురదృష్టవశాత్తూ పశ్చిమ పంజాబునుంచి వార్తలే రావడం మానివేశాయి. నిన్న మొన్నటివరకూ, నిజానికి ఈనాడుకూడా అక్కడివార్తలు మనకు సరిగా రావడంలేదు. వాళ్లకు బాగా సౌకర్యాలు ఉండబట్టి మన వార్తలు మాత్రం అందుతూనే ఉన్నాయి. పశ్చిమ పంజాబ్ కాందిశీకుల మూలంగానే మనకేమైనా తెలియడం తటస్థించింది. అలవచ్చిన కాందిశీకులు ఢిల్లీకివచ్చి అక్కడ జరిగిన అనేక దారుణకృత్యాలను వివరించారు. దాంతో ఢిల్లీ ప్రజల్లోకూడా ఉద్రేకం ప్రబలి నేటి కల్లోలాలు ప్రారంభమయ్యాయి. ఇదీ ఈ కల్లోలాల చరిత్ర. ఢిల్లీ సంఘటనలకు కాందిశీకుల విషాదగాథలే కారణం.

## ప్రభుత్వ బిల్లులు

2-వ పేజీ తరువాయి

మందు ఆప్రకారంగా చెల్లిస్తున్న శిస్తు ద్రవ్యరూపేణా ఎంత అవుతుందో ముందుగా ఇందులో 8 వ సెక్షను ప్రకారం ప్రభుత్వంచేసే రూల్సును అనుసరించి నిర్ణయించవలసి యుంటుంది.

2 వ సెక్షనును అనుసరించి ఏగ్రామంలోనైనా ఏరకంభూమికైనా నిర్ణయమైన శిస్తు సబ్ సెక్షన్ 1 లో చెప్పబడిన భూములకు ఆగ్రామంలోఉన్న అదేరకమైన భూములకు వర్తిస్తుంది. అంటే అవిధంగా నిర్ణయమైన శిస్తు ద్రవ్యరూపంలో చెల్లుబడిన శిస్తుకు తక్కువగా ఉంటేనే ఇది వర్తిస్తుంది.

ప్రత్యేకోద్యోగి ఎస్టేటులో తన పనిని పూర్తిచేసినమీదట రివెన్యూబోర్డు ద్వారా రాష్ట్రప్రభుత్వానికి తాను నిర్ణయించిన శిస్తురేట్లను వివరిస్తూ, అలా నిర్ణయించడానికి గల కారణాలను వివరిస్తూ ఒక నివేదిక సమర్పించవలసివుంటుంది.

ఈ నివేదికపైన రివెన్యూబోర్డు వారి సిఫార్సులను, నివేదికను విచారించినమీదట ఎస్టేటు గ్రామాల్లోని శిస్తులను గ్రామవారీగా భూమి తీరునుబట్టి తగ్గిస్తూ రాష్ట్రప్రభుత్వం ఫోర్టుసెంట్‌జార్జిగెజెట్ ద్వారా ఉత్తరవులను ప్రకటించును.

ఈ ప్రకారం ప్రకటింపబడే ఉత్తరవులు 1357 ఫసలీ ప్రారంభంనుండీ అమలులోకి రాగలవు.

4 వ సెక్షను 2 వ సబ్‌సెక్షన్‌ను అనుసరించి ఏ ఎస్టేటునుగురించి అయినా ఉత్తరవు చేయబడినతరువాత, ఎస్టేటులోని భూములన్నీ, 1938 శాసనంలో ఏ విధంగా ఉండి ఉన్నప్పటికీ, ఆ ఉత్తరవులోని శిస్తుకు మించకుండా నగదు రూపంలోనే చెల్లించుచూ ఉండవలెను.

4 వ సెక్షను 2 వ సబ్ సెక్షను ప్రకారం చేయబడిన ఉత్తరువులను ఏ కోర్టులో ప్రశ్నించేందుకు వీలులేదు. (అంటే ఈ ఉత్తరువులకు ఇంక తిరుగులేదు అనటం గాని లేదని తాత్పర్యం.)

4 వ సెక్షను 2 వ సబ్ సెక్షను ప్రకారంగా జారీచేయబడిన ఉత్తరువులలో నిర్ణయించిన శిస్తు శాశ్వతికంగా నిర్ణయమైనట్లే ఎంచవలసియుండును. ఖరారుచేయబడు కాలమును అనుసరించి ఆయా ఎస్టేట్లలో ప్రవేశపెట్టబడు రైత్వారీ విధానాన్ని అనుసరించి నిర్ణయింపబడిన శిస్తులే 1357 ఫ.లీ ను ఈ భూస్వామికి చెల్లుబడికావలసిన మొత్తంగా పరిగణింపబడును. ఇది ప్రభుత్వంవారు ఎస్టేట్లను స్వాధీన చేసుకొనేవరకూ అమలులో వుంటుంది. భూస్వాముల రైతుల హక్కులు అప్రకారంగా తిరిగి ఏర్పాటగును.

ఈవిధంగా తిరిగి ఏర్పాటుచేయుట వల్ల భూస్వామికి రైతుగాని, రైతుకు భూస్వామిగాని ఇవ్వతేలిన మొత్తాన్ని ఓకేదఫా ఇచ్చుకోవాలని గాని లేక దఫాలవారిగా చెల్లించవచ్చునని గాని, అతఫాలవారిగా చెల్లించేమొత్తాన్ని కూడా నిర్ణయించే అధికారం ప్రభుత్వానికి ఉంది. ఈ మొత్తం చెల్లించవలసిన తేదీలను నిర్ణయించడానికిన్నీ ప్రభుత్వానికి అధికారం గలదు.

ఈ శాసనోద్దేశాలను సాధించే నిమిత్తం అవసరమైన నిబంధనలను తయారుచేసే అధికారం ప్రభుత్వానికి ఉంది.

ఈ శాసనాన్ని అమలు చేయటంలో ఏమైనా ఇబ్బందులు ఏర్పడేటట్లు ఉంటే ఆ ఇబ్బందులను తొలగించే నిమిత్తం అవసరమనుకున్న ఉత్తరువులను చేయడానికిన్నీ ప్రభుత్వానికి హక్కుంది.

## ఢిల్లీ దాదాపు పూర్తిగా అదుపులోకి వచ్చింది

న్యూఢిల్లీ, సెప్టెంబరు 13: తూర్పు పంజాబులోనూ ఢిల్లీలోనూ సంక్షుభితము అయిన ప్రదేశాలను అన్నిటినీ ఇండియా సైన్యమువారు స్వాధీనపరుచుకొని హద్దుమీరకుండా ఉండేట్లు చేయకలిగినారని ఈ రోజున ఇండియా మంత్రివర్గమువారి అత్యవసరసంఘానికి ఇండియా సైనిక కార్యస్థానమువారు తెలియచేసినారు. ఎక్కడ ఏ మాత్రమూ సంక్షోభమూ చెలరేగినా వెంటనే మిలటరీవారు అణచివేయుటానికి పూనుకొన్నారు. అక్కడక్కడ చెదురుమదురుగా సాగినకొట్లాటలున్నూ, దోపిడీలున్నూ మినహాయిస్తే ఢిల్లీనగరమంతా మొత్తముమీద ప్రశాంతముగానే ఉందని చెప్పవచ్చును. సంక్షోభ ప్రదేశాలలో తీవ్రముగా గస్తీ తిరుగుతూ ఉన్నారు. ఆయా ప్రదేశాలలో దొంగ తుపాకులను మందుగుండు సరకులను చాలా పట్టుకొన్నారు.

తూర్పు పంజాబు పల్లెపట్టులు సంక్షుభితముగా ఉన్నప్పటికిన్నీ ఉభయ వర్గాల కాందిశీకుల వినిర్గమనమున్నూ క్రమంతముగా సాగుతూ ఉందని మిలటరీ వారు తెలియచేసినారు.

పాకిస్థాన్ ప్రభుత్వములో ఉద్యోగము చేయడానికి వెళ్లవలసిన సిబ్బందినీ వారి తాలూకు కుటుంబాలనూ ముందుగా పంపించివేయడానికి అత్యవసరసంఘమువారు నిర్ణయించినారు. ఈ ఉద్యోగస్థులున్నూ వారి కుటుంబాలవారున్నూ ఢిల్లీలో ఢక్ బడిపోయి ఉన్నారు. వీరిని మిలటరీ కాపలాతో పంపించివేయడానికి ఏర్పాట్లు పూర్తి అయినవి.

కాందిశీకులను అందరినీ ఆహారమూ వైద్యసహాయమూ బందోబస్తు అయిన కాపలా ఉండే శిబిరాలకు చేర్చవలసినదని ఢిల్లీ ఎమర్జెన్సీ కమిటీవారికి ఇండియా ప్రభుత్వమువారు తెలియచేసినారు. పంజాబు కాందిశీకులకు తమ తమ రాష్ట్రాలలోనూ తమ తమ సంస్థానాలలోనూ ఆశ్రయమిస్తాము అని ఇదివరలో కొన్ని రాష్ట్రాలవారున్నూ కొన్ని సంస్థానాలవారున్నూ ప్రధాన మంత్రి నెహ్రూ పండితునికి తెలియచేసినారు. ఇప్పుడు కొంతమంది ధనాఢ్యులు ఆయా కాందిశీకుల కుటుంబాలకు స్వయముగా ఆశ్రయమిస్తామని నెహ్రూ పండితునికి ఉత్తరాలు వ్రాసినారు. ఈ విషయము అంతా పరిష్కారము చేయడానికి కాందిశీకుల మంత్రివర్గమువారికి నెహ్రూపండితుడు పంపివేసినారు.

సబ్జీ వాడీఖాన్ అనే ప్రదేశములో ఒక బాంబు ప్రేలి ఒకరికిగాయాలు అయినవి. మూడుచోట్ల ఇండ్లకు నిప్పుముట్టించినారు. ఒకానొక ప్రదేశములో కొన్ని దుకాణాలను దోచివేయడము జరిగింది.

## శివారు గ్రామము ముట్టడి

ఢిల్లీనగరానికి 30 మైళ్ల దూరములో ఉన్న ఖార్ అనే గ్రామముమీద షుమారు పాతికవేలమంది దుండగులు దండయాత్రగా బయలుదేరినారు. అదుండగులు అందరున్నూ వివిధ మారణాయుధాలతోనూ వచ్చినారు. అప్పుడు అక్కడ ఉన్న మిలటరీవారు అంతమాత్రమును చెదరగొట్టకలిగినారు. అయితే ఆప్రాంతము అంతా భయోత్పాతముగా ఉండినందుమూలంగా ఇప్పుడు ఇంకా ఎక్కువగా మిలటరీని అక్కడికి పంపించినారు.

## ధాన్య సేకరణ

### మిల్లు యజమానుల ఉపేక్ష

ఏలూరు, సెప్టెంబరు 6 : వెటిపారయం జిల్లాకలెక్టరు ఆఫీసులో కలెక్టరుగారైన బి. మాధవరావుగారి అధ్యక్షతను జిల్లా ఫుడ్ కమిటీసభ జరిగినది. ఈ సభలో కలెక్టరుగారు ఆహార ధాన్యసేకరణ విషయమై ప్రస్తావించిరి. 28-8-47 తేదీనుండి 5-9-47 తేదీవరకు ధాన్యమునకై అర్జీ పెట్టి సాగించుటకల్ల వాడబడియున్న 40 వేల బస్తాల తీసికొనాల్సి వచ్చు. ఇందు నిమిత్తము కొందఱు, కొన్ని మాత్రమే గాక యిండ్లు, వటయిళ్లు, పదకగిదులు దాపరికంగా పరిశోధించవలసివచ్చినది. ఈ వసూలైన ధాన్యం సంతృప్తికరంగా లేదు. దీనిని తిరిగి మిల్లుకు చేర్పించాలంటే చాలా ప్రయత్నం చేయవలసివస్తుంది. రైతుల సహకారం చాలా తక్కువగా ఉంది. జిల్లాలో ధాన్యసేకరణ ఏజంట్లయిన మిల్లర్లు చాలా ఉపేక్ష చూపించుచున్నారు. మేము ఏదైనా ధాన్యము సేకరించి వారికి ఒప్పజెప్పితే దానిని బియ్యంకింద మార్చడము మాత్రమే వారు చేయుచున్న పని. కనుక ధాన్యసేకరణ చేస్తామని ఉత్సాహంగా ఎవరు ముందుకు వస్తే వారికి లైసెన్సులు యిచ్చినందువల్ల ఏమైనా పని జరుగుతుందేమో చూస్తే యిక్రమముగా ఉంటుందన్నారు. ఫుడ్ కమిటీవారు అందు కంగీకరించినందున ఈ జిల్లాలో వరిధాన్యంగాని, మెరకధాన్యములు గాని ఎవరు సేకరిస్తే వారికి లైసెన్సులు యిచ్చుటకు తీర్మానించడమైనది. అటు తర్వాత యీజిల్లాకు వచ్చిన 888 పట్టాజలు తాలూకావారీగా పంపకం చేశారు

## పరిశ్రమల మంత్రిపర్యటన

ఆదోని, సెప్టెంబరు 10 : పరిశ్రమల మంత్రి హెచ్. సీతారామరెడ్డిగారు నేడు ఆదోనికి వచ్చిరి. తాలూకా ఆఫీసులో సమావేశమైన ఉద్యోగుల సభలో మంత్రిగారు ఉపన్యసించిరి. ధాన్యసేకరణకు తోడ్పడవలెనని కోరిరి. అనంతరము యీ ప్రాంత రైతులు మంత్రిగారిని కలిసికొని తమ యిబ్బందులను తెలుపుకొనిరి. మంత్రిగారు బళ్లారినుండి ఆదోనికి వచ్చుచూ కొండమీద కంప్లి గ్రామమునకు విచ్చేసిరి. ప్రజలు తమకు యివ్వబడుచున్న గుడ్డ రేషను చాలదనియు ప్రభుత్వమువారు తమ వద్దనున్న వడ్లను తీసికొనుచున్నారే గాని దానికి బదులుగా జొన్నలు వగైరా ధాన్యములను యిచ్చుటలేదనియు కోరుచు వినతి పత్రము సమర్పించిరి. తర్వాత మంత్రిగారు ఆదూద్ధపురము, రామసాగరము, కమలాపురము, మలపనగుడి, కొండినాయకనపల్లి, అనంతశయనగుడి, గ్రామములందుగు అచటి ప్రజలు సమర్పించిన వినతిపత్రములను స్వీకరించిరి. సాయంత్రము 4 x 11 లకు హసాసపేట చేరి తుంగభద్రా ప్రాజెక్టును చూచుటకు వెళ్లిరి. ఇచటి శ్రీ రంగనాధ దేవాలయములో మంత్రిగారి సాయకత్వమున హరిజనులు ఆలయములో ప్రవేశించిరి.

ఈ నెల 6 తేదీని కదిరినుండి అనంతపురమునకు మంత్రిగారు వెళ్లిరి. ఉదయం కాంగ్రెసు భవనములో కాంగ్రెసు ప్రముఖులు పలువురు సమావేశమైరి. ఆహార సమస్య విషయమై మంత్రిగారు ఇష్టాగోష్టిగా చర్చించిరి.

ధాన్యము అమ్మినవారికి బోనసు చేకూటలేదని రామాచార్యులుగారు మంత్రిగారికి తెలియజేసిరి. ఆ బోనసును ఎరువుల రూపంగా రైతులు అర్జీ పెట్టుకొనవలసిన అగత్యము లేకుండాచేసే ఇవ్వవలెనని సుబ్బారావుగారు సంజీవరెడ్డిగారును సూచించిరి.

కమ్యూనిస్టుపార్టీ తరపున టి. నాగిరెడ్డిగారు మంత్రిగారిని సందర్శించిరి.

తరువాత తాలూకా ఆఫీసులో జరిగిన సభలో ధాన్యసేకరణమును గూర్చి మంత్రిగారు మాట్లాడిరి. ఈ ఆన తప్పరం జిల్లాకు నిర్ణయించియుండిన వేసుకనగసింది అత్యల్పముగా నున్నదనియు దానిని హెచ్చు చేయుటకు అగ్రికల్చరల్ డైరెక్టరుగారికి వ్రాసినామనియు తెలిపిరి.

ఈ డివిజనులో కనీసము 3 వేల బస్తాల ధాన్యమైనను వసూలుచేయగలమని అధికారులు తెలిపిరి.

## అక్రమవిధానం

### రాజమండ్రి తాలూకాలో చిన్నరైతులపై ఒత్తడి

రాజమండ్రి, సెప్టెంబరు 10 : రాజమండ్రి తాలూకాలో ధాన్యసేకరణ విషయమై రివిన్యూ ఉద్యోగులు తీవ్రంగా పని చేయుచున్నారు. వందలు యకరములు గల పెద్ద రైతులను వదలిపెట్టి చిన్న రైతులను ఒత్తిడిచేసి ధాన్యమును రాజమండ్రి తాలూకా తహస్సీలుదారుగారు తీసుకొనుచున్నారనియు అందువలన చిన రైతులకు చిన్న రైతులకు భోజన కష్టమగుచున్నదనియు తహస్సీలుదారుగారి చర్యలను అరికట్టవలెననియు ప్రభుత్వమువారిని కోరుచు రాజమండ్రి తాలూకా కాంగ్రెసు సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ నండూరి శోభనాద్రి ఆచార్యులుగా రొక ప్రకటన గావించిరి.

స్వ. వి.

## అపరధాన్యాల సరఫరా

చెన్నపురి, సెప్టెంబరు 14 : భారత ప్రభుత్వం 1945-46 కార్యక్రమాన్ననుసరించి చెన్నరాష్ట్రానికి ఇతర రాష్ట్రాల నుంచీ సంస్థానాలనుంచీ దిగుమతి కావలసిన అపరధాన్యాలు రావడంలేదు. భారత ప్రభుత్వ ప్రణాళిక ననుసరించి ఇతర రాష్ట్రములు, సంస్థానములు ఈ సరఫరా కు బాధ్యత వహించవలసియున్నవి. కాని ఆ ప్రభుత్వములు అపరధాన్యాల ఎగుమతి విషయంలో స్వతంత్రంగా వ్యవహరించుచుండుటవల్లనూ, ఆయా ప్రాంతాల ధరలు కంట్రోల్ ధరలకంటె హెచ్చుగా ఉండుటవల్లనూ సరఫరా జరగడంలేదు. పాకిస్తాన్‌లోని సింధురాష్ట్రంనుంచి రావలసిన 10,000 టన్నుల మినుములను పంపుటకు సింధు ప్రభుత్వం ఏర్పాట్లు చేయలేదు. వర్తకులకు ఎగుమతి చేసుకొనుటకు మాత్రం పర్మిట్లు ఇచ్చుచున్నారు. హైదరాబాదు సంస్థానంలో అపరాల ధరలపై కంట్రోల్ తొలగించినందువల్ల చెన్నరాష్ట్రానికి సరఫరా కావడంలేదు. అయితే నిజాం ప్రభుత్వం ఇచ్చే పర్మిట్ల నకల్లను చెన్నరాష్ట్ర ప్రభుత్వానికి పంపడానికి అంగీకరించింది.

వివిధ రాష్ట్రాలు అపరాల ధరలనుగురించి భిన్న పద్ధతు లవలంబించు చున్నందువల్ల సరఫరాకు ఇబ్బంది కలుగుతున్నది.

## సంపాదక లేఖలు

### 1917 ఏజన్సీ ఆక్టు

ఆర్యా, 1917 ఏజన్సీ ఆక్టును సవరించవలసినదని వడ్డి వెంకటరావుగారు వ్రాసియున్నారు.

చాలకాలమునుండి యీ ప్రాంతములో కోయలు, కొండజాతివారు నివసించుచుండిరి. అజ్ఞానులగుటచేత రువాత వచ్చిన వారు వారిని సులభముగ లోబరచుకొనిరి కోయల భూములనుగూడ యీ కొత్తగా వచ్చినవారు ఆక్రమించిరి ఈ పరిస్థితులను గమనించి జిల్లా కలెక్టరు ప్రతి గ్రామమునకు కోయల భూముల నితరులు కొనరాదనియు, కొనుటకు డిస్ట్రిక్టు కలెక్టరు అనుమతి పొందవలెనని యీ శాసనము చేయించిరి. ఈ శాసనమును సవరించిన, లేక రద్దుచేసిన పేదలకు కొండజాతి యీలకు మిక్కిలి నష్టము వాటిల్ల గలదు.

చోడి మల్లికార్జున.

* * *

### హరిజననిధి

ఆర్యా,

హరిజనసేవ నిమిత్తం ప్రత్యేకించిన కోటి రూపాయలను, జిల్లాలవారిగా, జనాభాప్రకారం విభజించి హరిజనోద్ధరణ ప్రణాళికను వెంటనే అమలు పరచవలెను

జిల్లా బోర్డులకు, మునిసిపాలిటీకి అప్పగించి సత్వరహరిజన సేవకు తోడ్పడవలసినదని ప్రభుత్వమును కోరుచున్నాను-

ఉండవల్లి శంకర కోటేశ్వర రావు

* * *

### ఒరిస్సా ఆంధ్రులు

ఆర్యా,

నూతన ఒరిస్సా రాష్ట్రం ఏర్పడిన పిమ్మట, అచ్చటనున్న ఆంధ్రుల కష్టములు మిక్కుటముగా నున్నవి. కోరాపుట్టి, గంజాం జిల్లాలు పూర్వము మద్రాసు రాష్ట్రములో ఉండెవి. ఈ రెండు జిల్లాలలో ఆంధ్రులు సుమారు సగమ్మంది లక్షలు గలరు. ఈ భాగములు తిరిగి ఆంధ్ర ప్రాంతములో కలియవలెనని అచ్చటి ప్రజలు కోరుచున్నారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు వారు, ఆంధ్ర మహాసభవారు, ఆంధ్రులు, తమ బాధ్యతె నెరింగి తమకు రాబోవు ఆంధ్ర రాష్ట్రములో కలుపుకొన ప్రయత్నించుట వారి ధర్మమై యున్నది.

అంగజాల వెంకటేశం,

ఆంధ్ర మహాసభ సంయుక్త కార్యదర్శి.

---



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7 ThambuChetty Street, G. T., Madras.